# చైనా విప్లవం

## (బుర్రకథ)



రచన:
అబ్బరాజు శర్మ

త్రిలింగ పబ్లిషింగ్ కంపెనీ
: విజయవాడ :

# చైనా విప్లవం

## (బుర్రకథ)



రచన :

అబ్బరాజు శర్మ



త్రిలింగ పబ్లిషింగ్ కంపెనీ

-- విజయవాడ --

# తొలిపలుకు



చైనావిప్లవం ఆసియాలోని పతితజాతు లన్నింటికీ ఆదర్శప్రాయంగా చెలువొందింది. మనదేశంలో సోషలిస్టు వ్యవస్థా స్థాపనకి గుణపాఠం వలనిగల ప్రాముఖ్యతే నన్నీ రచనకు ప్రోత్సాహపరచింది. కథాసన్నివేశాలతోపాటు ఎక్కువగా చైనావిప్లవ రాజకీయాలనుగూడ విశదంచేయ యత్నించాను.

కథను చెప్పడంలో వంతలకు పదాలు సామాన్యంగా వున్నవే వాడుకోడానికి, పణుతులు మార్చుకోడానికి, నాకే అభ్యంతరం లేదు. సెలవు

అబ్బరాజు శర్మ



# చైనా విప్లవము



ఆసియా ప్రజలఆశలో సై అమృతాలకల్పవల్లియై
కసితాళికోకవెల్లువై సై ప్రజాచైన గెలుపొందెరా !
ప్రజాచైననిర్మాతయై సై ప్రభులపీచ మణగజేసియు
కార్మిక కర్షక వీరుడూ సై కన్నతండ్రి మాసిటూంగ్ రా!
కదనమందుకోదమసింగము సై కష్టజీవులకు ఊతము
వలసదేశ బానిసీండ్రకు సై వెలుగుచూపుల ఎర్రసేనలూ!
ఎర్రసేన పదునుకత్తికి సై ఎదురులేదు శక్తివంతము
ధనికులెందరో కూలిరి సై ప్రభులకిరీటాల్ వంగెను
భూస్వాములులొంగిపోయిరి సై భూమిస్వర్గమే తెంచెరా!
పాశ్చాత్యుల కుట్రదోపిడి సై బడినశించు వలసప్రజలకు
నల్లజాతి చరితకంతకు సై దీప్తిదెచ్చిన వీరులు
ప్రాచ్యఖండ పేదతనము సై పారద్రోలు ధీమంతులు
పేదధనిక భేదమెరుగని సై ప్రేమభూమిసృష్టించిరి!
మావోచోటే వీరుల సై మార్గమందునే నడువరా
ప్రజాచైన వీరగాథలు సై భరతకర్షకా వినుమురా !

వ. ఈ నవచైనాసృష్టికి ఆదిలో చైనా అతి బీదదేశంగా వుండేది నాలుగు శతాబ్దాలుగా పరిపాలించిన మంచూరాజుల నిరంకుశత్వం ప్రజాజీవితాలను వికావికలు చేసింది.

ఘరానప్రభువులు మంచూరాజుల కాలిక్రింద నలిగి
పేదరైతుల జీవితాలు నిస్సేజమైనవండీ
రాజులెల్ల నజరాణాలల్లో రాణివాసముల్లో

పొద్దులువుచ్చుచు ప్రజాక్షేమము పొత్తునురచిరండీ
ధనవంతుల భూస్వాములదొరల తలలువెరిగినాయి
పరదేశస్థులవ్యాపారాలు పెచ్చుమీరినాయి
పల్లమంచుతో కుంభినివారు నాటకమూడారు
రాజురాజ్యములు తల్లకిందుగా రక్షరేకకట్టి
తమచేతుల్లో కీలుబొమ్మలను చేసుకొన్నారండి.
దేశధనికులు పరదేశపుల పజ్జచేరినారు
ప్రజారక్తములు పీల్చివేయుగా పిశాచులైనారు
ఎక్కడచూచిన ఆక్రందనలే ఆకలిచప్పులురా
శవస్వరూపులై రైతులు జనులు చాలిపోయినారు.

వ. ఇంత విశాలమైన చైనాభూభాగం దరిద్రదేవిన్రృత్యనిలయంగా మారిపోయింది. అజ్ఞానంతో, నిరాశరాస్యతతో అమాయికంగా రైతులు వేదనికాంకే అలవాటు పడిపోయారు. అలా మరింత కుంగిపోయిన చైనా భూభాగంలో మంచూరియా.

మంచూరాజుల పాలనచిక్కిన మంచూరియప్రాంతం
దుఃఖవాటియై కష్టభూమియై దురపిల్లుచునుండె
భూస్వాములకు పెత్తందార్లకు పుట్టినిల్లునగుచు
పరవ్యాపారస్థుల దోపిడిలో బుగ్గికలిసినది
విశాలచీనా సంపదనంతా కొల్లగొట్టిదొరలు
బీడుచేసి దుఃఖాలవాటిగా పాడుచేసినారు
పొలములోన కష్టించురైతుకు నిలువనీడలేదు
కష్టజీవిరక్తంబుద్రావెడి దుష్టధనికతత్వం
కరుడుగట్టిన మంచూరియలో కానరాదుసౌఖ్యం

వ. మంచూరియాప్రాంతంలో నాటిభూస్వామ్యం మరింత హీన పరిస్థితిలోవుండేది. భూస్వాములు పెచ్చుపెరిగి మిగతా రైతాంగమునంతా తాము బానిసలుగా కొనివేసి చిర కాలదాస్యం చేయించుకొనేవారు.

అలాంటి బానిసకుటుంబాల్లో హునాల్ ఒకడు.

మంచూరియాలో రైతుకుటుంబం – తందానో తందానతంధన
పేరుగల్లు హాలేరుజినోవు ,,
సాత్వికాన అప్పువంటిమనిషిరా ,,
సత్యసంధుడు మాటపొదుపరి ,,
పదునాల్గేడుల బాలయౌవనం ,,
పొదుపుపెట్టి భూస్వామిచాకిరికి ,,
జినోవుబ్రతుకు భారమెక్కువ ,,
మూడుగాళ్ళ ముసలవ్వతల్లిరా ,,
తమ్ముగురఁ్రులు పసికందులురా ,,
తండ్రిలేని సంసారభారము ,,
మోయసాగె జినోవుకష్టకుండు ,,
పగలురేయనక బానిసీడుగా ,,
ప్రభునివద్ద తననడుమువంచుతూ ,,
యింటికైన పెద్దసోదరుండుతా ,,
నగసిపోవ దుఃఖంచురా ,,

వ. జినోవుకొక పెద్దన్న చియాంగ్ వుండేవాడు. తండ్రి చనిపో గానే భూస్వామికడ ముందుగా పనికుదిరి అతడు సంసారం గడుపుతూండేవాడు.

మూగనూగమీసాల చియాంగు, జినోవు సోదరుడు
తల్లితమ్ముల బ్రతుకుభార మవుదలను దాల్చినాడు
భూస్వామికి వ్యవసాయికూలిగా పాలుపంచుకొనినాడు
నాటిరోజులలో భూస్వాములు నరరూపరక్కసులురా
వారినందరిని తలదన్నిన భూస్వామి దొరికినాడు
జీవితాంతమీపా లేరులను కొని వేశాడండీ.
యింటిపొలంపనికాక నీచపను లెన్నో చెపుతాడు
పెండ్లిపెటాకులు కాపురాలు ఈబానిసలకు లేవు
ఉన్నకాపురా లుండనీయరు తన్ని పంపుతారు
ఇల్లువుంచరు పొలములుంచ రిల్లాళ్ళ నిలువనీరు
తప్పుకలిగితే కొరడాకంచీదెబ్బలు తప్పవురా
కూడుబెట్టకదున్నలతో పాటు కొట్టిచంపుతూను
జరిమానాలు పెద్దఅప్పులు నెత్తిరుద్దుతూను
బానిసలను యమయాతనలలో బంధిస్తారండీ
వారియెదుటఒక తప్పువచ్చినా బానిసబ్రతుకదురా
పంచప్రాణములు ఆనిమునానే బలిగొంటారండీ

వ. ఇది ప్రపంచవిఖ్యాతమైన సత్యాం. ఇలా ప్రాణాలు రోసి, భయపడే, తప్పుచేసిన చియాంగ్ యిల్లువదలి పారిపోవాల్సి వచ్చింది.

చియాంగ్ సోదరుడేమి తప్పుచేసె — తందానా
పశువులకాపరై బయల్దేరినాడు — ,,
ఆలమందతో బయలుదేరినాడు — ,,
బీడు పొలాలలో మేపి వచ్చినాడు — ,,
ఆలమందలను తెచ్చి కొట్టమున కట్టివేసినాడు — ,,

బుంగలతోడ నీరుతోడి ఆపసులకడిగినాడు ,,
కూరపాదులకు నీరుపోసి మరి మడుల తడిపినాడు ,,
యింతలోన యిల్లాలు పిలిచినాడా ,,
వంటకాష్ఠములు కొట్టిపెట్టుమనియె ,,
వంటకుండలు శుభ్రిపరుపమనియె ,,
వండివంటలు ఆహారంబు తయారుచేశాడు ,,
పేరుగల్గిన పాలేరండి చియాంగ్ సోదరుడు ,,

వ. వంటయింటి పనులన్నీ పూర్తిచేసి తిరిగి కొష్టంలోకి చేరుకొన్నాడు చియాంగ్.

పశులకడకు వెనువెంటనెవచ్చె చియాంగ్ సోదరుడు
మేత తెచ్చితా వరుసవరుసగా పశులకేయసాగె
లేగదూడి కనిపించలేదయా ఆలమందలోన
తాడు తెంచుకొని పారిపోయినది తిరిగి వారిలేగ
వణికిపోయెరా దూడగనపడక చియాంగ్ సోదరుడు
పొలములన్ని వెనువెంటనె వాడు గాలించాడండీ
వూరివారి కొష్టాలనన్నిటి చూసివచ్చినాడు
పశువులదొడ్లను కసాయిశాలలు వరుసబెట్టినాడు
విసిగి వేసరి చియాంగ్ సోదరు డేమిచేసినాడు
కామందుల వారింటికిపోవ కాళ్లాడనులేదు

వ. తప్పు జరగడంచాలు, చిన్నదైనా పెద్దదైనా బానిసలకు ప్రాణహాని తప్పదు. ఆభయంతో మళ్ళీ భూస్వామిని చూడలేక పోయాడు చియాంగ్.

చియాంగ్ సోదరుడప్పుడు సై స్వగృహానికే తెంచెరా
తడబడ వణుకుకాళ్ళతో సై తడియారిపోని నాల్కతో

కండ్లనీరు కనులగుక్కుచు సై కన్నతల్లి చేరవచ్చెరా!
కొడుకునుజూడ తల్లియు సై జడిసినాది ఆతనిరాకతో
ప్రభులు యిల్లువిడచి వచ్చుట సై పరమతప్పిదంబగుటచే
యేమివచ్చెరా! నాయనా సై యెందుకిట్లువచ్చినావురా!
అనుచు వేలప్రశ్నలడిగెడి సై అమ్మగారియెదుట నిలబడి
దుఃఖఖిన్నితవదనుడై సై నేలచూచి చియాంగ్ రా.
మారుమాట చెప్పనేరక సై మాతృదేవికొక మొక్కిడి
తమ్ముగుర్రల నెత్తుక సై తృప్తిదీర ముద్దాడియు
యిల్లుచేరని తమ్ముని సై జనోవు ప్రేమదలంచుచు
భుజముపైన గుడ్డవేసుక సై పోయినాడు చియాంగురా!

వ. అదేపోక. యిక ఆ గ్రామంలో కాదుకదా ఆ పొలిమేరల ఆమడదూరంలో ఎక్కడున్నా తను చచ్చిపోతాడు. ఆ భయంతోనే చియాంగ్ పారిపోయాడు. తల్లితమ్ముల కూడా తన ప్రాణనిమిత్తం వదలుకొన్నాడు.

పోవుచుంటివా! సోదరా!
బాటలేని బాటసారివా?

కామందుబాధలు తప్పక
కడలేని సంసారమీదక
కానగానని జీవపు
ప్రయాణనౌక విడతువా? 1
ఏదిక్కుకేగెదు వన్నయ్యా
ఏదారలు నినుగాంతురన్నయా!
కమురుకం పీచైనలో
కాలుమోప వీలు లేదురా? 2

నిన్ను విడిచి నిలువలేదురా
కన్నతల్లి కడుపుమంటరా
రెక్కరాని చిన్ని నలుసులు
తమ్ముగుర్రిల చూడవా? 3
పాలములోన జవసత్వముల్
పొడిసి సర్వఖండాలను
మేడమిద్దెలను కూర్చియు
ఖామందున కప్పగిస్తివా? 4
తిన్న ఇల్లు కుక్కనామెత
నిన్ను రక్తమోడ్చజేసినారురా
ఆసాములకేమగాక
పిరికిపందవై పోదువా? 5
ఏమిలాభ మీనడకలో
ఎంతమారమని పోరావు
ఎక్కడైన ధనికులొక్కటై
ఉక్కడింతురు బీదలా? 6

వ. లేగమాడ కన్పించకపోవడం, చియాంగ్ తిరిగి తనయింటికి రాకపోవడం భూస్వామికి మరింత చీకాకు కలిగించాయి. యింత దొంగతనం తనయింట్లో తన పాలేరే చేయడం సహించలేకపోయాడు. సపరివారంగా బయల్దేరాడు ఖామందు.

మరునాడా ఖామందుగారు తనబలగమంత చేరి
చియాంగ్ చేసిన చోరత్వానికి చిందువేసినాడు
వడివడిగా పరివారముతోడ నడువసాగినాడు

పుడమివడకగా దిక్కులదరగా పొగరబోతువాడు
రంకెవేయుచు జనోవింటికి రయము వచ్చినాడు
చియాంగేడని గద్దించుచు ఆ తల్లినడిగినాడు
దాచినావటే బొంకులాడియని దుర్భాషల నాడి
జుట్టుపుచ్చుకొని ముసలితల్లిని జరజరలాగాడు
యిల్లుమొత్తమీరీతి వాడు గల్లంతుచేయువేళ
వూరిపెద్దలు నల్వురచ్చటికి చేరినారుబాబు!

వ. పాపం, నష్టపడినభూస్వామి కష్టంమూచి తీర్పుచెప్పడానికి, న్యాయాన్యాయం విచారించడానికి ఆ చేరినపెద్దలంతా శ్రమపడి పెద్దపంచాయితీ చేశారు. వారితీర్పు ప్రకారం యిరువాగులవా రొప్పుకోవాల్సిందే.

అన్నబదులకాతమ్ముడు సై అర్పణమ్ముచేయమనిరిరా
యిరువదేండ్ల చాకిచాకిరి సై యజమానికిసేయమనిరిరా
శేగదూడవిలువ పైకము సై నిర్ణయించిరి వారలు
జరిమానాతో మొత్తము సై యిరవైడాలర్లనిరిరా
యేడాదికొంతచెప్పున సై మిగతతమ్ములచాకిరీ
తోడతీర్చుకొనిపోవుచు సై వూడిగంబు నిర్ణయించిరి
యిరువదేండ్లుయిట్లు అణకువ సై సేవచేయఆపైననే
ముక్తకల్లుకాపరానికి సై బదులేదురా తీర్పుకు
పెద్దమనుష్యులతీర్పును సై యెదిరింపవీలులేదురా
తల్లితోడపెద్దతమ్ముడు సై దండమిడియె జనోవురా
వెనువెంటనె అక్షరిదు సై సీటిబంగ బుజముకెత్తియు
భక్తివినయభావమ్ముల సై ప్రభునికొలువుసాగించెరా.

యజమానియింట్లో చాకిరి తాను ఎల్లవేళలాను
చేయుచురోసిపోవుచుండె జనోవుబానిసీను
అన్న చేసినచౌర్యమున తానాహుతియైపోతూ
దినదినానికి చిక్కిపోయి బక్కగైనశరీరంబు
తరాలనరాలలో జవసత్వము లర్పణముచేసినాడు
దుఃఖతులైన కసుగందులు ఆతమ్ముళ్లనూగూడ
పశులకాయుటకు పుల్లరియెరుగ పంపుచున్నవాడు
పెద్ద పెద్దపనులన్ని తనకుతానిర్వర్తించుచును
చిన్నపనులకు సోదరు లంపుచు చేసెచాకిరీని
యిట్టి అభాగ్యరైతుజీవనం బెట్లు గడవగలదు
రెండువత్సరా లీరీతిగనే గడచిపోయినాయి.

వ. యుగయుగాలు పెరిగిపోయిన యీ బానిసతత్వం నశింప చేసేందుకు సన్‌యత్ సేన్ అవతరించాడు.

భరతజాతికి బాపు జీవలె - తందానో తందానతంధన
చైనదేశస్వాతంత్ర్యదాతరా ,,
వీరసింహుడు సన్‌యత్ సేను ,,
రైతునాయకుడు ప్రజాబంధువు ,,
కమ్యూనిష్టు జాతీయపక్షముల ,,
కూడదీసి యువ్వెత్తుసేనగా ,,
ప్రజావాహినుల నడిపించుచును ,,
ప్రభులగుండెలు తల్లడిల్లగా ,,
జాతీయవిప్లవం సాగించాడండో ,,

వ. సన్‌యత్ సేన్ ప్రజాస్వామికత్రియీ ధర్మసూత్రాలు ప్రజలంతా మెచ్చుకొన్నారు. అతని నాయకత్వం కమ్యూ

నిష్టు క్యుమింటాంగ్ పార్టీలు రెండు సమన్వయించు కొన్నాయి. అతని పిలుపు దేశానికంతా విజయభేరీ అయింది.

గేయం

కదలిరా!

కదలిరా స్వతంత్రయోధ కదలిరావయా!
ప్రజాసమిష్టి చైనాను సృష్టిచేయరా!
యుగయుగాలు స్వేచ్ఛలేక
యుడిగిపోతిమి
మనసుఖాలు దిగమ్రింగిన యీ
ప్రభులు నిలతురా 1
పరులదేశ వ్యాపారపు
బందిఖానలో
అంధమయము వికృతమైన
జీవితాలలో
ఎన్నిదినము లీనరకము త్రెంచివేయరా
స్వాతంత్ర్యయువకుడా 2
ప్రభుత్వాలు దేశమ్ములు
ప్రజలకొరకురా
బ్రతుకు తెరువు హక్కులన్ని
ప్రజలవేనురా 3
సమసమాజ నిర్మితిలో
స్వేచ్ఛపథములో
పాశ్చాత్యుల మదగర్వం
బణచి వేయరా 4

చావో బ్రితుకులైన గాని
వెనుక లేదురా
సమరమే శరణ్యమింక సాగిరమ్మురా
కార్మిక కర్షకులు యితర
పీడిత ప్రజలు
కర్మభూమి మాతృగడ్డ తర్పణకొరకై
ప్రాణములను బలిమీద
పోరు సల్పుడీ !
దుష్టపాలనము మాపి సుఖము నిల్పుడీ ! 5

వ. ఆ మహానీయుని పిలుపు వేదనిర్వచనంగా ప్రజలు గ్రహించారు. ఎక్కడికక్కడ వర్గసంఘాలుగా ప్రజలు సమిష్టి వుద్యమానికి సన్నద్ధులైనారు.

సన్ యట్ సేన్ స్వాతంత్ర్యపథకము జడివినారు ప్రజలు
వీరరసోత్సాహితులైనారు వేగిరించినారు
యుగయుగాలుగా బండబారిన బానిసీండ్రి మనసు
నవ్యస్వేచ్ఛవాతావరణంబున ననలు తొడిగినాది
రైతురాజులు నాగేరులతో రాణ నడచినారు
యుద్ధద్రోహులైపోయిన భూమికాపుల నణచారు
కూలివర్గములు సమ్మెటలతో కూడివచ్చినారు
యువకవీర విద్యార్థి బృందములు వుప్పెనవలెపొంగ
అగ్నిపర్వతమువోలె గభీరంబైన ప్రజలవుడుకు
లేహో మాహోయని విప్లవానికి రెక్కలిప్పినాయి

వ. వారికి చక్కని తరుణం లభించింది. పెకింగ్‌లో మొట్టమొదటగా ఒక విద్యార్థిబృందం బయల్దేరి విదేశీ అంగడు

లన్నీ ముట్టడించింది. ఆనాడు చరిత్రాత్మకమైన మే
నాల్గవ తేదీ.

ప్రజాస్వైన చారిత్రమందున పర్వదినమురా, స్వతంత్రవెల్లు
పందొంందొందల పందొమ్మిది మే నాల్గవ తేదీరా!
మే నాల్గవ తేదీరా
నాల్గవ తేదీ నాడెవిప్లవపు నాందీవచనమురా –
తందానా తందానా తందాన తందనానా।

పెకింగ్‌నందున విద్యార్థులు స్వాతంత్ర్యయోధులై
దుష్టపాలన ద్రోహదౌరతనం కూలద్రోయగా
ప్రజ్వలించినారు
వీరులు ప్రజ్వలించినారు
వరుస వరుస విదేశాంగదులు ధ్వంసమొచేశారు•
తందానా తందానా తందానతందనానా।

మోసకారులై దొంగపద్ధతుల ప్రజలదోచెడి
వ్యాపారులను కంపెనీలను బుగ్గిగలిపినారు
వీరులు బుగ్గిగలిపినారు.
పరాయిదేశపు పెట్టుబడులను భగ్నపరచిరండీ!
తందానా తందానా తందానతందనానా

రుద్రమూర్తులై రైతువీరులు పొలంగట్లపై నిల్వద్రొ
క్కుకొని ప్రజాద్రోహి భూస్వాములనెల్ల నెట్టి
వేసినారు
వీరులు నెట్టివేసినారు
భూమిహక్కు పండించువానికని పొలుపుచెప్పినారు
తందానా తందానా తందానతందనానా।

అమెరికా జర్మ౯ దొరలతో మేళమించి లాభాలు గుంజుచు
కష్టపడెడి కూలీలమ్రింగెడి కర్మాగారముల యంత్ర
శాలల కూలదోసినారు
క్రూరుల్ కూలదోసినారు
కూలదోసియా కీలకయంత్రాల్ కూలీలసొమ్మని అనిరి
తందానాతందానా తందానతందనానా।
వడివడివచ్చి ప్రజాసేనలు ప్రభుత్వయంత్ర దుష్టాంగంబులు
కచేరికోర్టుకారాగారాల్ గుప్పటపట్టి కూలదోసినారు
విజయముకేలదాల్చినారు.
ద్రోహపాలనవు మంచూరాజులు తల్లడిల్లిరండీ -
తందానా తందానా తందానతంధనానా।
పరదేశీయుల పాలితోత్తులై పనికిమాలినపిరికిపందలై
ప్రజలసుఖములు పరులకొడ్డిన పాపపాలకులుగా -
మంచురాజులందరూను
ప్రభుత్వయంత్రాల్ విడిచి మెల్లిగా పలాయినించారు -
తందానా తందానా తందానతంధనానా।

వ. పొంగివచ్చే ప్రజావిప్లవానికి మంచూప్రభుత్వం నిలువ లేక పోయింది. వెంటనే రాచరికం నాశనంచెంది ప్రజా స్వామ్య సూత్రాలు వృహా౯ పరిపాలన ప్రారంభమ యింది. అనాడు మంచూరియా ప్రాంతం.

వరుసవరుసగా దేశమల్లుకొను విప్లవాగ్నిజ్వాల
నాలుచెరుగుల విశాలచైనా కప్పివేసినాది
రైతుయువకబృందాలు వీరులై రాటిదేలినారు
భూమిస్వాములపెత్తనమంతా బుగ్గికలిపినారు

ప్రభుత్వయంత్రాల్ తుపాకీలురా యెదురునిల్వలేక
తలలువాల్చినవి రైతుసేనలకదండమిడినవోడి
పెరిగిపోయిననాటివీరుల ప్రజాసేనవచ్చి
మంచూరియాలో భూమిపద్ధతిమార్పుచేయసాగె.

వ. దళాలుగా వచ్చి భూమిసేన నాటి భూవ్యవస్థా విధానంలో మార్పులను సాధించింది. పెద్దపెద్ద మిరాశదార్లను తొల గించింది. భూమి పంపిణీలు తిరిగి అమలుజరిపింది. యిలా మారిపోతూన్న కాలంచూచి ఖామందూరకొన్నాడా ?

జనోప్రభూ కామందురా సై చూచినావు విప్లవంబును
తలలువాల్చి ఆసాములు సై తొలగిపోవుచున్నారురా
పెద్దపెద్ద మిల్లువారులు సై బోర్డులన్ని త్రిప్పివేసిరి
గుత్తగొన్న వ్యాపారులు సై కూలిపోవుచున్నారురా
అమెరికా జపానుతొత్తులు సై ఆరిపోయి రొక్కమూరుగా
తెల్లదొరల కంపెనీలురా సై తర్లిపోయె తమదేశము
నాటిసిత్తుశెల్ల చూచెరా సై మాయదారి ఖామందురా
పుట్టి బుద్ధులోడెంటనే సై పథకమెల్ల మార్చివేసెరా
మంచూరియలో నున్నచో సై మసిగావలసిందేనని
ఆ ప్రదేశమిడిచిపోవగా సై యత్నించెను కామందురా.

వ. అతనికి మంచూరియలోనేగాక హునాన్ రాష్ట్రంలో కూడా పెద్దగా స్వంతఆస్తు లున్నాయి. బ్రతుకు ముప్పమైన మంచూరియానుంచి తాను హునాన్ పోతే పరవా. లేదనుకొన్నాడు.

అర్ధరాత్రిమున భూకామందు ఆప్తులందరీని
చేరబిలిచి తమ మూటముల్లెల సర్దమన్నడండీ

కోష్టమందుగల పసులనన్నిటిని వదలివేసినాడు
సరకు సరంజామాల బిగించి చయ్యన కదిలారు.
బ్రతుకు కష్టమె మంచూరియలో పడి నలుగుటకంటే
దిగలు ఆస్తిగల హునాన్‌లోన మేల్మిగాను బ్రతుక
భార్య బిడ్డలు బంధువులు సేవకులతోడ కదిలి
బాగసీండ్రను, జనోవు తమ్ముల వెంటబెట్టుకొని
అర్ధరాత్రి తామందరుకూడ అల్లరిలేకుండా
పలాయనంబు పఠియించారు పరమశూరులంతా
సిశిరాత్రిప్పుడు వారందరును పిశాచగణమట్లు.
రైతు ప్రజాదళములకు భయపడి పారిపోయారు
వ. తెలివిగా తప్పించుకొనిన హునాన్ రాష్ట్రంలో చేరిన కామందు వెంటనే అక్కడి తన ఆస్తులన్నింటిని పైన సేద్యం నియోగించి బలపడసాగాడు.

హునాన్ రాష్ట్రము చేరియు – తాదానో తందానతందన
మరల కాపురాల్ నిడుకొని ,,
తనకుగల్గు యెస్టేటుతోడను ,,
తృప్తిపొందుచు భూకామందు ,,
పాలేరుల సాయంబుతోడుత ,,
పుంజీభవమొందిబలిసెరా ,,
క్రమక్రమంబుగా బలపడి ,,
భూమిమీద లాభించుచు ,,
రెండువత్సరాల్ నిండగా ,,
నిల్వదొక్క కామందురా ,,

వ. ఆ రెండుసంత్సరాలు భూమందులు, పెట్టుబడిదార్లకు

నిజంగా మంచిరోజులు. కాని సామాన్య ప్రజాజీవితం ఆనాడు మరింత దెబ్బతిని పోయింది. ముఖ్యంగా మొదటి ప్రపంచయుద్ధం వారిని పీల్చివేసింది.

రెండువత్సరాల్ చైనాచరిత్రలో గడ్డురోజులండీ
మొదటిప్రపంచయుద్ధ మప్పుడే పూర్తిచెందినాది
యుద్ధమందు విపరీతలాభములుపొంది ధనికులంతా
పరప్రభుత్వవ్యాపారాలకు మద్దతులిచ్చారు.
జపానమెరికాలంతాంగం బల చాలాపారినాది
ధనికవాదులతో భూస్వాములతో తలలు మార్చి వారు
చైనానంత దరిద్రభూమిగా చేసివేసినారు
కట్టుగుడ్డలు తిండిపదార్థాల్ కరువై పోయినవి
మధ్యతరగతులు రైతుప్రజలును మాడిపోయినారు
వారిజీవితంబులకు మేలిమి ఒనగూర్పగ లేక
వుహాన్ ప్రభుత ధనవంతులకు లొంగిపోయినాది
ప్రజలమరచి పరదేశస్థులకు పాదమొత్తినాది
వారు తెచ్చిన స్వతంత్రమంతా వ్యర్థంబును చేసి
ప్రజలమనసుల భీతిచికాకు పెచ్చునేసినాది.

వ. దరిద్రగొట్టులై దేశమంతా యిలా క్షీణించిపోతూండే ప్రజాతంత్రి వుహాను ప్రభుత్వం మారుమాట్లాడలేక పోయింది. చెంగైషేక్ అసమర్థత్వం ప్రజానీకానికి బుజువైంది.

దరిద్రదేవత రైతు ప్రజలకొక దారి చూపలేక
ధనికవాదులతో చేతులు కలిపిన దొరతనంబు ఫక్కి
చూచినారు కమ్యూనిస్టులు పరిశుద్ధవర్తనులురా

రక్తమోడ్చి సాధించినస్వేచ్ఛ రిక్తసిమూకలకు
యింధనమైనది ప్రజాసౌఖ్యము యిగిరిపోయినది
జాతిపక్షమీరారీతి ప్రజలకు దూరమగుట చూచి
ప్రజానాయకులు కమ్యూనిష్టులు ప్రజ్వలించినారు
రైతుప్రజలను మధ్యతరగతిని వర్గసంఘములుగా
సుశిక్షితులుగా తయారుచేయుచు చూచినార లదను

వ. వారివృత్తమయిన ఆర్థిక ప్రజానూత్రాలు చైనా రైతాంగాని కంతా హృదయానికి హత్తుకపోయాయి. నిర్వచితమైన ఖచ్చితమైన ఆర్థిక కార్యక్రమంలేని జాతీయ ప్రభుత్వం పట్ల విశ్వాసం సడలింది.

దరిద్రపీడిత ప్రజలందరు యువ్వెత్తు లేచినారా తందానా
అంతర్యుద్ధము ప్రేరేపించారా తందానా
యుగయుగాలుగా రాచరికాల, విదేశవస్తు వ్యాపారాల
అణిగిపోయినవారి బ్రతుకులను, నవస్వతంత్రత,
జాతీయ ప్రభుత, యేమితెచ్చినది – తందానా
ఏమిలాభమొసగె – తందానా
భూస్వాములలో మార్పులేదండీ – తందానా
యుద్ధవాదులై పెచ్చుమీరినారా – తందానా
ప్రజల బ్రతుకు బహు భారమైనదండీ – తందానా
అట్టిసమయమున వీరమూర్తిరా ప్రజాచైన సృష్టించు
ధీరుడు, మాసిటాంగ్ తన రైతు వుద్యమం మార్పు
చేసినాడు – తందానా.
రైతుదళాలను నిర్మితిచేసాడు – తందానా
స్వంతపంటల రక్షించెడు స్వాతంత్ర్య రైతు జనదళముల

కూర్చి ధీరవర్యుడు భూమి పంపిణీ మార్పుచేయనెంచె - తం॥
భూస్వామిత్వము రద్దుచేయనెంచె - తందానా
పొలముహక్కు కర్షకుల కీయనెంచె - తందానా

వ. మాసెటూంగ్ ప్రజాస్వాతంత్ర్య పంటరత్నదశాలు బహు ముఖాల పెరిగిపోయినాయి. సునిశితమైనవారి ఆర్థిక కార్యక్రమం, చైనాచరిత్రకంతా విజ్ఞాన శిఖలను వెలార్చింది

గేయం

చైనావిముక్తి దాతా!
జై జై మావో, వీరా!
వూరుపేరు లేనట్టి అనాథ
రైతు కుటుంబములో
ప్రాచ్యఖండ శిఖరాల వెలుగువై
జనియించితె బాబూ! 1
బౌద్ధమతస్థుండిచ్చిన విద్య
భిక్షతోడ పెరిగీ 2
సమరసూత్ర ప్రజ్ఞావిశాలతను
సాధించితివయ్యా!
అంతులేని రైతాంగబాధల
ఆక్రందిత జనుల
పెనుగుండెలలో విప్లవామృతను
ప్రేమ గురిసినావా 3
పెకింగ్‌నందున వున్నత విద్యల
అభ్యాసించుచునూ

ప్రజోద్యమంలో పాల్గొని లాఠీ
బాధల కెదిరావా 4
యుద్ధవాదులై ప్రజాభక్షణతో
ఊరిపోవు ప్రభులా
పరుల దేశవాణిజ్య వస్తువుల
భగ్న పరచినావా 5
బాంబులవర్షాల్ పోలీస్ లాఠీల్
భగ్న పరుపలేని
చిక్కని విప్లవ శాస్త్రజ్ఞానము
సొత్తు చేసినావా 6
మత్తుమందు చీనాకై తాంగపు
మందబుద్ధిలోన
అగ్నికణాలు రగిల్చి విప్లవము
అధ్యవసించావా 7
పాతబూచు చీనాకుటుంబపు
పరమార్థత వీడి
పరమాత విద్యావతియైన స్వాద్వీక హైను
స్వీకరించినావా 8
ధీరమూర్తులౌ మీ దంపతు లుత్తీర్ణ విప్లవాన
తారచంద్రులై ప్రాచ్యజాతి ప్రజ
తాప మార్పినారా 9

మాసిటాంగునిర్మించిన రైతుదళాలు పెరిగినవి
విప్లవసూత్రము లాచరణాన వెల్లువాల్చినాయి
గెరిల్లయుద్ధముదళములన్నియు కోహటించినాయి

విదేశవ్యాపారులుధునమగా విస్తరించినాయి
పాతకాలపు భూమిపంపిణీపద్ధతి మార్చాలి
పొలములోన కష్టించువారికే పొలంహక్కుగాన
గట్టులుపెట్టిరి పాలేరులు భూకామందుల నడిపి
కాసీండ్రివ్యవసాయపద్ధతి పరిమార్చాలనిరి
ఉత్పత్తం తాప్రిజలదేనని వుద్ఘాటించారు
గుత్తగొనెడి వాణిజ్యపద్ధతి కూడదన్నరండి
స్వీయదేశ మీ పద్ధతిలోన సమృద్ధికావాలి
వ. పైరుదళా లీప్రిజాసూత్రాలను చక్కగా వివరించి తమ కార్యక్రమం భూస్వామికతకు వ్యతిరేకంగా ఆరంభించాయి. ఇదే కమ్యూనిష్టు నవచైనాకు అవతరణ.

మాసిటాంగు విప్లవసూత్రములు-తందానా తంధాన|తంధన
ప్రిజలకెల్ల వుత్సాహమిచ్చినవి ,,
గేరుమీరిన గెరిల్లదళములు ,,
ముందు కురికినవి భూమిహక్కుకై ,,
రైతువిప్లవము చెలరేగింది ,,
అంతర్యుద్ధము ఆవహిల్లినది ,,
ఎక్కడికక్కడ భూమివిభజనలు - ,,
ఎక్కడికక్కడ సహకారసంఘాల్ ,,
ఎక్కడికక్కడ ప్రిజల కోర్టులు ,,
నిర్మించుచు గ్రామాల వరుసగా ,,
కమ్యూనిస్టులు విజృంభించారు ,,
కొద్దిపాటి శిక్షిత రైతాంగము ,,
కోరితాొచుల ఋూ విధితీరి ,,

గ్రామగ్రామ విముక్తి సేయుచు ,,
కియాంగ్ హువాన్ ప్రాంతమందిలి ,,
మంచూరియ పొలిమేర లన్నిటి ,,
స్వాధీనంబు చేసుకొన్నరండో ,,

వ. ఈ ప్రజావిజయాలు భూస్వామివర్గమున కంతా దిగ్భ్రమ కలిగించింది. ఈ భయంతోనే జినోవు కామంనుగూడా తన భవితవ్యా ఆలోచించుకొన్నాడు.

రైతువిప్లవం బీవిధంబుగా రగిలిపోవుచుండ
జినోవ్ కామం దతి తెలివిగ మునుముందె మేలుకొనియె
శేపో మాపో తమ రాష్ట్రముకును రాగల మొప్పంబు
తమ ఆస్తులు, తమ పాలేరులకు తర్పితమగునంచు
పుట్టుబుద్ధులఖామం దంతంట పథక మల్లినాడు
పాలేరుతోపాటు కలసి తా విప్లవదళములను
మోసగింపగా పథక మొక్కటి వ్యూహచేసినాడు.
సాదరాన భూస్వామి జినోవును చేరబిల్చినాడు
నవ్వుమొగముతో ఎన్నడులేని నాల్కతీపితోడ
జినోవు నవ్వాడు దగ్గరచేర్చి చెప్పసాగినాడు
లేతగొంతుతో వాత్సల్యంతో పూతమెరుగుతోడ
పలుకుతున్న భూస్వామిని చూచి భయము చెందుతూను
పాలేరైనజినోవునిల్చెర వినయసంభ్రములతో

వ. జినోవు మనసును స్వాధీనం చేసుకోడానికి కామం దెంతో నటన చేసాడు. ఎక్కడలేని ప్రేమ, ఆదరణ పొంగిపో తూంటే తన ఆలోచనలన్నీ విప్పిచెప్పాడు.

చూచినావ జినోవ్ యీ సై చిత్రి మెక్కడై నున్నదా
కమ్యూనిష్టులంట చూచితే సై గుండాలుర వారందరూ
గెరిల్లయుద్ధము పేరుతో సై దొంగమూక లైనారురా
పాపభీతిలేదు వారికి సై దైవచింత లేదు వారికి
ప్రభులనెల్ల తొలగించుచు సై పంటలెల్ల కాల్చివేయుచు
ప్రజలనెల్ల రెచ్చగొట్టెడి సై బటాచోరు రౌడీలురా
కూడుపెట్టు భూస్వాముల సై గుడ్డయిచ్చి ద్రవ్యదాతల
తండ్రిలంటి పెద్దవారిపై సై దాడిచేస్తున్నారురా
వట్టిమూఢ ప్రజలందరి సై చుట్టాలమ్మని చెప్పచూ
చివరకు రైతులగూడను సై చంపివేయు దురాత్ములు
వారిచేతిలో బడితివా సై వారిమాయలో బడితివా
తిన్నకూడుగూడ దక్కక సై మన్నుగలిసి పోవుటేనురా

వ. అలాంటి దుర్మార్గులచేతుల్లోబడి నాశనమొందే కంటే తండ్రిలాగా తనను మొదట్నించీ, ప్రేమిస్తూన్న తనఖామందునే అంటిపెట్టుకోవడం మంచిదికాదూ ?

కన్నకుమారునికన్నమిన్నగా కాచుచుంటి నిన్ను
మొదటినుంచి నీక్షేమముకొరకే వ్యధల గుందుచుంటి
పూల పూజలచేయుచు దేవుని మొక్కుకొందునేను
తండ్రిలేనినిను రక్షింపంగా అనవరతము నిజము
నిను మక్కువతో పెంచుచుండిన నాదుమాటవినరా
రేపోమాపో యీ కమ్యూనిష్టురౌడీ లొస్తారు
నా కుమారుడవుగానే అప్పుడు నటియించుమునీవు
నన్నె తండ్రిగా చూపించుము నాయింటిపేరుచెప్పి
నేనుగూడ నా స్వంతపుత్రుడని లోకమునకుచెప్పి

నిన్నుశాశ్వతకాలంబును పోషిస్తువుందునయ్యా
శీఘ్రకాలమునె నీకు పెండ్లినిచేతు పిల్లదెచ్చి
నిన్నునిలిపి ఒకయింటివాడిగా నేను మురిసిపోదు.

వ. ఆ మాటలినడంతోటే జినోవురక్తం వుడికిపోయింది. నవ మాసాలు మోసి కనిపెంచిన తల్లిదండ్రులుకాకుండా పోతాడా ?

రోషముతోడ జినోవప్పుడువుడికిపోయినాడు - తందానతాన
రోమరోమమున, కోపాగ్నులు క్రొవ్విసము ,,
గ్రక్కినాయి ,,
తల్లిదండ్రుల విడిచివేయవలెనా ?
అష్టకష్టములకోర్చి తమను తమ పాలుమాంసముల
రూపమిచ్చి పోషించిన తల్లితండ్రి పేరువిడచీ ,,
పరాయివానికి అమ్ముడు పోవడమా ,,
ప్రజాద్రోహికి అమ్ముడుపోవడమా ,,
యింటిపేరును, వంశగౌరవము, తల్లిదండ్రుల కడుపుకష్టము
తోటిసోదరుల ప్రేమభావము తోసిపుచ్చవలెనా-తందానతాన
కిరాయి బ్రతుకుతో కూలిపోవవలెనా ,,
కనులవెంట నీర్గారె జినోవునకు ,,
గద్గదమయ్యె కంఠస్వరమంత ,,
ప్రేముతోడ తను పారాడిన ఆ కాలమందున రెక్క
లందునకూడకట్టుకొనిపాలముకూలీకిపోయినమాతృదేవి
స్వస్వరూపమున ప్రత్యక్షంబయ్యె ,,
కన్నతల్లికే యింతటి ద్రోహమా ,,
పెండ్లికోసమా, డబ్బుకోసమా ఎంగిలి జీవితమా ,,

ఉరికిపోయెరా జినోవ్ పాలేరు — తందానా

పుట్టుబుద్ధుల కామందునకు ఎట్లులైనను బుద్ధి చెప్పవలె
ఎదురు తిరగవలె తప్పదంచును పాణమైన నపోనీయటం
చును మనసు దలచినాడు — తందానతాన
వల్లకాదనే వెంటనె చెప్పాడు ,,
నీకుమారుడను నే కాదన్నాడు ,,

వ. ఆమాటలు జినోవునోటివెంటరావడం భూస్వామిఅనుకోని విషయం. అతని ఆశలన్నీ నేలగలసిపోయినాయి.

ఆ స్థికొరకుగా యింతవ్యూహము అల్లినభూస్వామి
జినోవ్మాటలు విన్న వెంటనే చివ్వున ఎగిరాకు
ప్రక్కనేవున్న యినుపచువ్వలో పతెల్ మని తలపై
విసిరినాడురా పొగరుబోతు భూస్వామి రంకెవేస్తూ
పెంకివెధవలు తిన్నయింటికే బొక్క పెట్టువారు
నీచులంచును కూకలువేస్తూ తాళ్ళచుపాముపోలె
పైకియెగసి పెడరెక్కలు విరచి సంభ్రాంతికట్టి
నూటయిరువది కొరడా దెబ్బలు కొట్టినాడు అతని
రక్తనదములై శరీరమంతా రాట్లుపడనదండీ
స్మృతులుతప్పి పడిపోయె జినోవు — చింతమానులాగా

వ. భూస్వామికి కోపంతగ్గి దెబ్బలుచాలించేసరికి జినోవ్ నేల మీాద స్మృతి రహితంగా శవమో కాదో అన్న స్థితిలో పడిపోయాడు.

స్మృతులతప్పిన బానిస పైసై మృతుడుకాగలండంచునో
చావుకేసు తప్పుకోసమై పైసై కామందాలోచించియు
పెడవివిరచి వెనువెంటనే పైసై దాసజనుల పిలిపించియు

యింటికావల గలిన సై కాల్వవద్దు కిక్కించియూ
స్మృతి తెలీని జినోవును సై విడిచివేసి వెళ్లినాదురా
దారిపోవువార లెందరో సై తారసిల్లి గాంచినారలు
కానికామందు భయముతో సై ఒక్కడైన పలుకరింపదూ
సాయంచీకటి వరకును సై స్మృతి తెలీని దేహమక్కడే
ప్రక్కకైన పోర్ల లేదురా సై బండవోలె పడియుండెరా

వ. చీకటిపడిం తరువాత గ్రామంలోనికి ఆదారే సంగుకన్యక
వచ్చింది, ఆమె కమ్యూనిష్టు వలంటీరు.

ఆ చీకటిలో సంగకన్య ఆ బాటవచ్చినాది
కమ్యూనిష్టుమహిళోద్యమాన పేర్గన్న వీరవడతి
పెద్దచదువులు చదవకున్నను బద్ధిగలమనిషి
సుగుణరాశి విజ్ఞానవల్లియై శోభచెందినాది
పథ్యన్మదినత్యాగముల తనదు ప్రాయమంతకూడ
ప్రజలసేవకంకిత మొనర్చిన వీరనారి ఆమె

వ ఆమెకంటపడింది జినోవ్ శవంకాని దేహం. వెంటనే ఆమె
ఆగిపోయింది.

స్మృతులతప్పిన జినోవుదేహముపైన నీరువోసి
ప్రథమచికిత్సలుచేసి గాయములకట్లుకట్టినాది
సేదతీర్చినవెనుక జినోవు సోదనంతా వినియె
దయాపరమ్మాతల్లి గుండె ఆర్ద్రిమ్మాయిపోయె
భూస్వాములనిర్దాక్షిణ్యాల్లాం మోసకారితనము
మెదిరించినవాడంచు జినోవును పొగడసాగినాది
మరల వాడిమొగ మింక చూడకు మనకు లోపమేమి
కష్టపడెడివా డెక్కడైనను గణనచేయగలడు

తమ్ము నాతో నీగాయములన్నీ మానిపోవువరకు
వుండమన్నాట బ్రతుకు తెరువును వేరెచూచుకొందు
వనుచు జల్కనసంగుమాటల ఆశ్చర్యమునొంది
జినో వంతట ఆమె చెప్పినచొప్పున తలవంచె.
వశివడి వారలవ్వాడు – బండిలోననేపోయిరి
రైతులకై నిర్మించిన – రాత్రిపాఠశాల్చేరిరి
చక్కని పాలాలలోపల – చుక్కవోలిక నున్నది
విప్లవ శాస్త్రపండితులై – ఎందరెందరో రైతులు
గెరిల్ల యుద్ధవీరులై – కాలుదువ్వుచున్నారలు
వారిని చూచినంతట – జినోవు సంతసమొందాడు
వారి విధానమంతయు – వానికి ముచ్చట గొల్పింది.

వ. పాఠశాలనంతా, విద్యార్థులు, బోధనా పద్ధతులు, యితర విషయాలు, అన్నిటనీ జినోవుకు సంగుకన్య పరిచయం చేసింది. తనవంటి వారనేకమంది పాలేర్లక్కడ అతి విజ్ఞానులవడం జినోవ్కూడా అక్కడుండా లనిపించింది. ఆరాత్రి పూట చివరాంతంలో.

సంగుకన్యక జినోవుతోడ చెప్పినాది యిటుల
వారిలోన తనుగూడ వుండమని బాలికచెప్పింది
వారుచెప్పు పాఠాలు నేర్వమని ఆజ్ఞయిచ్చినాది
తనకు వీలు పడ్డప్పుడువచ్చు తన్ను చూసిపోతు
క్షేమసమాచారాలు తానుగా తెలిసికొందుననియె
తెల్లవారవస్తూన్నది కాన వెళ్ళిపోదుననియె
వెంటనె తానట వుండరాదని వేగమె కదిలింది
సంగు కన్యక గూడభరంగా తిరుగుచున్నదంత

వ. దానికి కారణ మానాడు కుమింగ్‌టాంగ్, కమ్యూనిష్టులు విడిబడిపోవడమే. రైతువిప్లవపు మొదటిరోజుల్లో వున్న "అసమర్థత్వం" విడనాడి చెంగైషేక్ ప్రభుత్వం విప్లవప్రతీఘాతకత్వం వహించింది.

ఒక్కసారిగా చెంగైషేకు మారిపోయినాడు
సన్‌యత్‌సేన్ సమధర్మసూత్రములు జారవిడిచినాడు
విప్లవాన ప్రాణాలనొడ్డిన వీరులమరచాడు
దేశభక్తితత్పరత అతనిలో జీర్ణమొందినాది
పక్కావ్యాపారస్థులమనిషై ప్రజలమాటమరచె
కంపెనీలకు ధనవంతులకు కామందులకును
తొత్తువోలిక లొంగిపోయి విద్రోహియైనడండి
రైతువీరులిరీతిగసల్పెడి కోటివిప్లవంబు
ప్రక్కలోని చాకగుచువారిని డొక్కలోన పొడిచె.

వ. ఎక్కడెక్కడున్న కమ్యూనిస్టులను వెంటనే అరెస్టుచేయడం, ఉద్యోగాల్లో వున్నవారిని తీసివేయడం, రైతుదళాల పైన, కార్మికవర్గాలపైన, కాల్పులుసాగించడం ప్రారంభించారు.

కుమింటాంగ్ సైన్యమందున – తాందానోతందానతంధం
ఆఫీసులలోవుద్యోగాల ,,
కుడిభుజాలవలె తనకువుండిన ,,
కమ్యూనిస్టులను ఒక్కరాత్రిలో ,,
ఒక్కహుకుంతో వదిలించాడు ,,
ప్రభుత్వయంత్రము నంతగుప్పెట ,,

బిగియించినెంటనే ఏమిచేసెరా తందానా
దిక్కులేని రైతుజనములందర ,,
ఎదురువచ్చిన మాటాడువారిని ,,
కమ్యూనిష్టులటు చిత్రిణసేసి ,,
విప్లవాత్మక ప్రగతిశీలుర ,,
వేలకొలది రైతుపుత్రులందరి ,,
కాల్చివేసెరా కర్ర కాళిని ,,
పోలీస్ బలగముతోడుత ,,
ధనికవాదులతోడుత ,,
ప్రజాభక్షణ సల్పసాగినాడు ,,

వ. ఈ విద్రోహపంథాను ప్రజలంతా గుర్తించారు. ముఖ్యంగా శ్రామికరైతు, కూలీ, మధ్యతరగతి ప్రజలు ఈ పార్టీల విభాగంలో కమ్యూనిష్టులకే తైవార మొసగారు.

ద్రోహబుద్ధితో చెంగైషేక్ చేసినమోసముగా
ప్రజలెరింగియె భగ్నపరచిరి ఫలితమొందలేదు
ప్రభుత చేతిలోవున్న మాత్రినే ప్రజలుకలిసిరారు
వారిలోన విప్లవపుటగ్నులు చల్లారనెలేదు.
ముఖ్యమైన ఆక్రమిత ప్రాంతములు హునాన్ షాంఘైలన్
ప్రజలు కమ్యూనిష్టులకుజై యని బయలుదేరినారు
మాసెటూంగ్ వీరోత్తముని తమ నాయకునిగానెంచి
విజయనాదముల విప్లవంబును వుధృతపరచారు
పోలీస్ వత్తిడిమెండైపోయిన ప్రాంతమందువారు
గూఢచారులై తిరుగుచు కార్యక్రమము జరిపినారు

వ. హూనాన్ ప్రాంతమునంతా వారు స్థిరంచేసుకొని, అప్రదే

శంలో కమ్యూనిజం పూర్తి ఆచరణకు దెచ్చి, అజేయమని పించారు.

గేయం

అదిగో! అదిగో! స్వతంత్రచీనా!
అదిగో! ప్రజాప్రభుత్వం

ప్రభులు తాంత్రికులు మతాధిపతులు
భూస్వాముల పూంజీవిధానములు
నరకభూమి నాకస్వర్గవాటిగా
ప్రేమపూరిత సమాజచిత్రము 1
డొక్కలుమాడే రైతులు లేరు
రెక్కలుచించే కూలీల్లేరు
పీడితపీడక వర్గమె లేదు
సమసమాజము శాంతినిలయము 2
నరుని నరునికి బానిసచేసి
నరాల నరాలను పీల్చివేసెడి
ధనికన్యాయము తీర్పులు లేవు
బురఖాకోర్టులు జైళ్లును లేవు 3
కుటుంబ యంత్రాంగమునందున
కోరుకున్న బానిసజీవులుగా
కొడుకులగను యంత్రాలవారిక
కుమారిరత్నా లసలే లేరు. 4
సహకార ప్రతిపాదనతోటి
సమిష్టజీవన సౌరభములలో
ప్రేమపుష్ప ఫలితోద్యానంబై 5

వెలుగుదెచ్చినది ఎర్రచైనరా
వలసజీవనములో కురూపులై
వ్యాపారపువస్తువుల పోలిక
అమ్ముకుపోయె ఆసియప్రజలకు
ఆదర్శపు శిఖరాల జ్యోతిరా 6

వ. ఈ సమసమాజం ధనికవాదులకు కన్నెర్రి కలిగించినది.
వారంతా చైంగైషేకును వత్తిడిచేశారు.

చెంగైషేకుతో మిలాఖతయిన పిశాచశక్తులన్ని
కుట్రలుపన్ని ప్రజారాజ్యమును కూలద్రోయనెంచి
హునాన్ ప్రాంతము ముట్టడింపగా వత్తిడి తెచ్చారు
యుద్ధప్రకటనలుచేసి నడువగా హెచ్చరించినారు
సైన్యవాహినులు తర్లింపంగా వేడుకొన్నరంశి
ధనికవాదులచేతిలోబొమ్మ చెంగైషేకపుడు
యుద్ధప్రకటనముచేసి హునాన్ముట్టడించినాడు
విజయమొక్కవీసంబులేదుగా చంగ్ సైన్యములకు.

వ. యుద్ధంతో సైన్యపు పోటాపోటీలతో ఏమాత్రం లాభం చిక్కని క్యుమింటాంగ్ ప్రభుత్వం వెంటనే ఆర్థికదిగ్బంధంకూడా చేసింది. అసలే వుత్పత్తిలో బీదరాష్ట్రమైన హునాన్, దానికి పరాయిప్రాంతాలనుండి రావాలసిన తిండి పదార్థాలను రాకుండా చేసింది.

దారుణహత్యలు దోపిడీలు విస్తారరక్తనదులు
పారించిరి క్యుమింటాంగ్ సేనలు కిరాతకత్వమున
గ్రామాలనుమొత్తంబుగాను కాల్చారుబాంబులతో
అంతులేని యీ దారుణసమరం బెంతవరకుసాగె

విప్లవాత్మజాతీయనాయకుడు మావొటాంగ్ యిల్లు
యిల్లుకూల్చి యిల్లాలు సోదరినికూడ చంపినారు
రక్తసిమూకలు క్రూరాత్మ లీ రీతిపెచ్చుపెరిగి
కమ్యూనిష్టుల ఎరచ్చైనను కూల్చివేయగాను
ఎన్నితిప్పలో పడిరిగాని తుదకేమి లాభమండి
లొంగిరాని యీప్రజాసైన్యము చాగుసేనలంత
దేశమునకు ఆర్థికముగా నొక దిగ్బంధముదెచ్చె

వ. యెనిమిది నెలలపాటు అమలు జరిగిన ఆ ఆర్థిక దిగ్బంధంలో.

హునాన్ రాష్ట్రం బసలే బీడండి - తందానా
పండిన పంటలు ప్రజకు చాలవు, కట్టుగుడ్డలకు మిల్లులు
పరిసర రాష్ట్రిదిగుమతిక బాధపడిరి వారు తందానా
ప్రజలు కుప్పలుగ కూలిపోయినారా - తందానా
ఆగలేని ఆకలితో, బాధతో, ప్రజలు వచ్చితమ
పాలనంబు స్వీకరింతురని వెర్రిభ్రమలతో
చేసినారు ప్రభులు - తందానా
కాని వారి ఆశలకు మందు కనిపెట్టినాడు మావో - తందానా
ధీశాలి ప్రజ్ఞానిధియైన వీరమావొయాంగ్ - తందానా
ప్రజావాహినుల హెచ్చరించినాడు - తందానా
కన్నతల్లి యీ మాతృభూమిలో కష్టమొందిన రైతు
ఘోష్ప్రిలను కరాటికోదన యేమాత్రముండరాదు - తందానా
మాతృభూమి మన కన్నరత్నభూమి - తందానా
తీవ్ర ప్రయత్నాల్ మీరు చేయరండి - తందానా
అధికోత్పత్తికి అందరు యత్నించి - తందానా

పొలము పనులలో వుత్పత్తులలో ప్రతిపొరుండును
బాధ్యతవ్వాని కష్టపడండయ్యా - తందానా
బీడులుపొలములు బంజర్లనుసాగుకు
తెండోయీా - తందానా
సహకారంబునవ్యవసాయుంబు, వర్తకంబును, వుత్ప
త్తులనువంపిణీను సాద్యపరిస్తేను - తందానా
మనసమస్యలు తీరిపోవునండీ ,,
మాతృభూమిని నమ్మి పని కిదిగుడు ,,
మనతల్లిగడ్డయే మనకు శరణ్యమురా ,,
వ. మాసిటాంగ్ అధికోత్పత్తి నినాదాన్ని శిరోధార్యంగా కై
కొన్నారు ప్రజలు. తమకాళ్ళమీద తాము స్థిరంగా నిల
బడటంగాక అవ్వూతంతో ఛ్యమింగ్‌టాంగ్ సైన్యాన్ని
యెనిమదివేల మైళ్ళదాకా తరిమేయగలిగాయి.
ప్రతిచైనాస్వాతంత్ర్యపౌరుని మాసిటాంగ్‌వాక్కు
వేదవాక్కుగాగ్రహింయింపబడి ఆచరింవబడియె
వెనువెంటనెప్రతివర్గము ప్రజలువేగరించినారు
తిమ శక్తులకేంద్రీకరించి వుత్పత్తిపెంచినారు
సాగులేనిబంజర్లనుదున్ని క్షేత్రంబులుచేసి
సహకారపువ్యాపారపద్ధతులు సాగింపగచేసి
ప్రతివస్తువును ప్రజలచేతనే ప్రజలకొరకుగాను
పంపిణీలిపిరాష్ట్రమునంతా వృద్ధిచేసినారు
వ. ఈవుత్పత్తికార్యభారంలో జినోవుకూడా పాలుగైకొన్నాడు.
నాటిబాధ్యతనెరిగియు సై మేటిజోదుజినోవురా
తరలినాడు భూమందుకు సై దర్శనంబుచేసుకొనియెరా

పొలములోన తనకుభాగపు సై పంపిణీనడిగినాడురా
తనకుటుంబమంతనిలువునా సై తప్పనిసరివుండాల్సిన
యిరువదెకరముల భూమిని సై యిమ్మనమని తానడిగెరా
తల్లిసోదరులతోడుత సై తిరిగి భూమిలోదున్నుచు
బ్రతుకనెంచివచ్చి అడిగిన సై రైతుపుత్రునిచూచియు
నాటిదేశ వైఖరెరిగిన సై కామందంతట వెంటనే
మారుమాటచెప్పకుండనె సై యిచ్చివేసెరా పొలమును
వెంటనే పొలపుగట్లను సై విడబడజేసినాడురా
తల్లితమ్ములందెచ్చియు సై తర్లించెను నాగేలులు
నాగలివట్టేరైతుకు సై భోగభాగ్యములు తప్పవు.

వ. దేశమంతా స్వయంసమృద్ధంగా ఒక ప్రక్క జరుగుతూ రెండవవైపు యుద్ధం జరిగింది. చివరకు క్యూమింటాంగ్ సేనలు వెనుకంజవేయ సాగాయి.

సస్యశ్యామలం చెనారాష్ట్రము సర్వశక్తులాను
జాతిసైన్యముల నుక్కడిగించ సాగవచ్చినాయి
అమెరికన్ల సేనాధిపత్యము తల్లక్రిందులయ్యె
ధనికవాదుల ఆలోచనలు దుమ్ముగలిసినాయి
తలలువంచి యుద్ధోన్మాదులు దండమిడిరి తాము
సైనికాళితో చెంగ్ కై షేక్ జారిపోయినాడు
మొగమువాల్చి కర్షకదళాలకు మోకరిల్లినాడు
యీ విధంబున దిగ్బంధనము తొలగిపోయినాది.

వ. దిగ్బంధనాన్ని బ్రద్దలుచేసిన ఎర్రసేన జైత్రయాత్ర ప్రారంభించింది.

రైతుదళములు గెరిల్లయోధులు రాణామీరిన
ప్రజావాహినులు విప్లవోత్సాహత వీరమూర్తులై
ఒక్కమారుగా విజృంభించారు
వీరుడు మావో పేరు దలచినారు
మావో వీరుని నాయకత్వమున సాగినారు వారు - తందానా
తందానా తంగానా తంధనానా

వారిలోన ఒక చిన్ని గెరిల్లావీరదళమునకు అధిపతియగుచు
రైతుజినోవు ప్రజ్వలించినాడు
వీరజినోవుకు యెదురేలేదండీ
యెదురులేని తమ గెరిల్లసేనతో యుద్ధముచేసినారు - తందానా
తందానా తందానతంధనానా

తటపటతటపట ప్రభుత్వ యంత్రాల్ కోర్టుకచేరీల్
సైనికభాగాల్ వశము చేసుకొనిరి
రైతులు వశము చేసికొనిరి
సుస్థిరంగా యెనిమిదిచోట్ల సైన్యములుంచారు - తందానా
తందానా తంధనా నా

యెదురువచ్చిన ధనికవాదులకు, భూస్వాములకు, మఠాధిపతులకు, యితర దేశవ్యాపారస్థులకు తగిన విధముగా
సమాధానము చెప్పిపంపినారు
వీరులు విజయమందినారు
విజయమందిన సేన కుత్తరచైనా వశమయ్యె - తందానా
తందానా తందానతంధనానా

వీరజినోవ్‌తోడి నిలుచుచు సంగకన్యక ధీరబాలిక మెరుపు
లాగా, తనయుద్ధభూమిలో, యెదిరినెదురుచు, సౌమనస్య

మున యుద్ధసీమలో, సైనికులకు, ఔషధములిచ్చుచు సేవ
చేసినాది                తందానా

తల్లికి చైనా ఋణమువడెను                తందానా

సంఘకన్యక విప్లవసూత్రం విజయసాధకంబు – తందానా
తందానా తందానతంథనానా

కమ్యూనిష్టుమహోద్యమంబున, గణుతికెక్కినసంఘ
కన్యక యుద్ధక్షతులకు ఔషధమిచ్చుట, గెలిచినట్టిభూ
భాగములందు సామ్యవాదసూత్రములనన్నిటి అనుసరించినాది
సామ్యవాదమువ్రిచార మొనరించి
జిల్లప్రదేశములవెనువెంటనె కమ్యూనిజముదెచ్చినారు–తందానా
తందానా తందనానా

పేదధనికులభేదములేక, కలిమిలేముల కష్టములేక,
సర్వహక్కులు ప్రజాపరంబై సామ్యవాదమహిమ
ప్రజలందరును స్వాగతించిరారు
ఎక్కడేగిన ఎర్రసైన్యమునకు హారతులెత్తారు తందానాతందానా
తందానా తంధనానా

జైత్రయాత్రలో మూడవశకము సేనాధిపు డగుచు
చెంగైషేక్ వచ్చినాడురా సేనతోడ కదలి
కమ్యూనిష్టు చైనాను నాశము చేయవచ్చినట్టి
మేల్మినాయకుడు చంగైషేకును ప్రజాసేన అపుడు
కొద్దికష్టములో చిటికలమీద కూలద్రోసినాది
ద్రోహి ప్రభుత్వపు సారథియైన చంగైషేకయితే
దొరకిపోయెరా కమ్యూనిష్టుల సేనచేతులల్లో
కాని వీరుడు మాసిటాంగ్ తనకదన సూత్రములను

విస్మరించక పొగరుబోతును విశిపించేశాడు
తలనువంచి తనదారికిపోయెరా చంగ్గై షేకపుడు

వ. ఈ జైత్రయాత్రలో విముక్తమైన ఉత్తరచైనా మాగాణా
అంతా ఎర్రప్రభుత్వం బలపర్చుకొనింది. యనాన్‌ను తన
ప్రధాన ప్రాతిపదికగా నిల్పుకొంది.

స్వతంత్రచైనా విశాలభూమిని స్వేచ్ఛాజీవులురా
కార్మికకర్షక ప్రజావాహినులు కమ్యూనిజముదెచ్చి
సమసమాజముసృష్టిచేసికొని సహకారంబులతో
ప్రేమభావముల నవోద్యమంతో ప్రజ్వలించినారు.
వారిలోన మన వీరజినోవు వన్నెకు వచ్చాడు.
గెరిల్లదళముల అధినేత్రియై విఖ్యాతినందినాడు
అతనికపుడు చేదోడైనదిరా అమృతబాలసంగు
విప్లవంబు నేర్పించిన సాధ్వి వీరవనితసంగు
సంగుకన్యకతో వీరజినోవు సఖ్యమంత పెరిగి
ప్రేమవల్లికలు చిగిరించెనవో వీర హృదయములలో
ప్రజాసేవలో ఆరితేరిన వీరమూర్తులపుడు
వివాహంబు తలపెట్టినారురా పుష్పవృష్టకురియ

వ. వారివివాహం నిజంగా చరిత్రాత్మకం.

సంగుకన్యక దెచ్చెరా
సంపెంగి పూలదండలు 1
వీరజినోవు దెచ్చెరా
విప్లవగంధపు పూలతలు 2
సంగుకన్యక దెచ్చెరా
చల్లనివిసన కర్రలు 3

వీరజినోవు తెచ్చేరా
చెరుకుపాలలో వెన్నెలు 4
నూనుగుమీసాల పెండ్లికొమరుడు
నునుసిగ్గు నవ్వులకన్యరా
అంచలాన తారచంద్రులు
ఆనందవెన్నెల కురిసిరి 5
చల్లనిజీవిత నౌకలో
సాగిపోవు చందమామలో
చిరుతదంపతు లిద్దరు
తొంగిచూచి మురిసికొన్నారు 6

వ. మరి రెండు సంవత్సరాలలో జపాన్‌తో యుద్ధం ప్రారంభ మయింది! ఎనిమిదేండ్లుగా ఎడతెగని యీపోరాటంలో చాంగై షేక్ విద్రోహత్వం వలనే ఎర్రచైనా విస్తరించింది.

నవ్యదంపతులరాచకీయ ఆనందవ్యూహాలల్లో
రెండవగాలితుఫాను రేగినది రెండువత్సరాల్లో
చైనావిప్లవమందు మూడవదశ ప్రారంభించే
ద్రోహబుద్ధి పరపీడనశక్తి దుష్టజపాన్ వాడు
చైనాఆక్రమణానికి సైన్యసన్నాహముతోడ
యుద్ధప్రకటనచేసిననాడు సామ్రాజ్యదాహగరిమ
జపాన్‌వారిదృష్టి ఎర్రచైనామీద నేవుంది
యానాన్‌ప్రాంత సముద్రమంతయు ఆహవరంగముగా
మార్చినౌకలను దించారండి మారణహోమముకు

వ. కమ్యూనిష్టు ప్రాంతంలో జపాన్ దాడి ముమ్మరంగా సాగు

తున్నంతకాలం చంగైషేక్ మౌనంవహించాడు. అతని విద్రోహత్వం కమ్యూనిష్టులను ఏమాత్రం బలహీన పర్చక పోగా జపాన్ బలం క్రమంగా నశించింది.

వీరవర్యుడు జినోవు నాడు విజృంభించాడు
సముద్రప్రాంతపు కాలాసైన్యం చక్కజేరినాడు
వీరపత్నియగు సంగుచేరినది వుత్సాహంతోడ
తులెగాతుల్లకు ఔషధసాయం చేయుచున్నదండి
వారి దేశభక్తికి యెదిర్చెడి వీరులెవరు లేరు
ఎంతజపాన్ మరి యెంతఅమెరికా ఏమిచేయగలదు
ప్రజాసైన్యము ధారావాహిని ప్రజ్వరిల్లినాది
జపాన్ వారి నౌకాబలమును చక్కలుచేసింది

వ. ఈ పరాయి శక్తిని యెదుర్కోవడానికి జాతీయశక్తులైక్యం కావడంమంచిది. కనుక కమ్యూనిష్టులు కూమింగ్టాంగ్‌తో రాజీ నడిపారు.

పరదేశస్థుడు జపాన్ వాడు – తందానోతందానతందాన
వచ్చిఫాసిస్టు జపాన్ వాడురా ,,
యింటిగుట్టు కబళింపచూచెనా ,,
అన్నదమ్ములీరెండుకక్షలు ,,
చీలికలేక కలిసిమెలిసియే ,,
మూడవవాడిని రానీగూడదు ,,
వచ్చినశత్రువు చూచినాడురా ,,
కమ్యూనిస్టులు చూచినారురా ,,
జాతిపక్షముతో సంధిచేయగా ,,
రాయబారముఅంపిరి వారపుడు

కుదరలేదు రాజీవిధానమునకొన్నపద్ధతులలో
చంగైషేక్ జపానుపైన సమరము ప్రకటించె
సైన్యవాహిని కొన్నిటినప్పుడు జపానుపై కంపె
కాసిఅమెరికా నాయకత్వముకు కాళ్లుచాచినాడు
వ్యాపారపుద్రోపిడీయంత్రాంగము అమెరికాసహాయం
దేశమందువిద్రోహశక్తులను చేరదీసినాది
జాతిసైన్యము నడిపించుచునే నీతితోకవారు
దేశపాలనలో జోక్యంగొని విద్రోహుల పెంచారు
ధనికశక్తులను, భూస్వాములను, దగ్గరచేర్చారు
కమ్యూనిస్టులస్నేహతత్వము కాలదన్నినారు
మిత్రులగా సన్నప్పటికని సామ్రాజ్యవాదులంతా
ఎర్రసైనికపుడప్పుడు సేనలంపినారు
రెండువైపుల పదునుకత్తిరా సిందుఎర్రసైన్యం
చెదరలేదు విజయంబుపొందగా విజృంభించింది.

వ. రెండువైపులా చైనా ఎర్రసైన్యం తీవ్రరూపందాల్చి పోరా
డుతూ తనప్రాంతాన్ని పిసమైనా పోకుండా చేసికొంది.

ఎర్రసేన పోరాటములోన యెదురులేనియగ్ని
దుష్టజపాను శక్తులన్నిటిని త్రోసిపుచ్చినాది
యెనిమిదేండ్లగా యుద్ధం తనయెదురు నిల్చినాది
చివరకు జపాన్ చంగైషేకు తా సంధిచేసుకొనియె
ధనికరాజ్యముల యిర్వురలో ఒక పొత్తుకుదిరినాది
అమెరికన్ల పోటీలుతగ్గి వారంతకూడినారు
అందరుకలిసి నాడెత్తిరిరా ఎర్రసేనపైం

వ. జపాన్‌తో సంధికుదరగానే చంగైషేక్ తిరిగి సోవియట్
చైనాపై తనబలాన్ని కేంద్రీకరించాడు
రెచ్చిపోయిన చంగైషేకు రీతిని గనుగొనుచు
కమ్యూనిష్టులు తమ బలగాలను కూడదీసినారు
నాలుచెరగుల గల తమసైన్యం కేంద్రపరచినారు
వీరజనోవు మొదలైన విప్లవ గెరిల్లయోధుల
క్యూమింటాంగ్ సేనల నెదిర్చగా కోహటిల్లిరు
తడయక తటపట వీరులు వారు దండువెడలగానే
భూమిమాత సంతోషపడినది పొంగిపోయినది

జనగేయం

అణగారిన జనబంధువు
ఎర్రసేనగాథ వినుమురా!
తుచ్ఛపుర్వులై కాలిరి
దుష్మరీతులై మాడిరి
క్యూమింగ్‌టాంగ్ జాతిద్రోహులు
క్రమక్రమంబుగా కూలిరి
ఒక్కమారు సైన్య మడిగిన
దిక్కులేదురా దొరలకు 1
కొన్నిచోట్ల జాతిసైన్యముల్
క్యూమింటాంగులోని రైతులు
మందుతుపాకీలన్నిటిన్
వదిలి రైతుదళములు జేరియు
మీరుమేము అన్నదమ్ములం
బీదవారమని చెప్పిరి 2

కొన్నిచోట్ల గూఢచారులై
ఎర్రిసైనలో కెళ్ళిన
క్యుమింటాంగు సైనికాళిరా
ఎర్రిసైనలుజీవితాల్
చూచి వాడలు మరచిపోవుచు
ఒక్క-మారె కమ్యూనిష్టులై
మారిపోవుచునుండిరి 3
తనదు సేన వీగిపోవుట
తెలిసినవాడు చంగై షేకురా
అమెరికన్ల పిలిపించియు
సైన్యసంఖ్య హెచ్చించియు
ఎంత పెంచినా ఏమిటో
సుంతయైనలాభముండదు 4
తెల్ల వాడు తిరిగిబ్రతుకుడు
తెల్ల దొంగ నిలువ లేదురా
రోజు రోజుక్కీరీతిగా
తెల్ల జాతి అమెరికన్లను
ధనికవాదప్రభులందరు
తేలగుర్రము వేసి భయముతో
తగ్గినారురా వెనుకకు 5

వ. ఇలా యుద్ధరంగము ఎర్రిసేన వశ్రమించిపోతూంది. నాటికి పదిరాష్ట్రాలు నదసంగా విముక్తి చేయగలిగింది. ఒకనాడు
రణరంగంబుననుండి జినోవాక రాత్రివూట తాను
విశ్రమింపగా చేరినాడురా వీరుడు శిబిరంబు

శిబిరమందు విశ్రాంతిగ నిద్రపోవునపుడు వాని
పొంచియుండిన దుర్జర అమెరికా దొంగలుచూచారు
నలురమెరికా సైనికులపుడు అమాంతముగవచ్చి
నోటగుడ్డలు గుక్కివేసిరి కాళ్లుగట్టివారు
కారులోననే వీరజినోవును కట్టిపడేశారు.
వీరజినోవును తీసుకపోయి వారానిశిలోన
కట్టిపడేసిరి కారాగృహమున కటికబండపైన
వెంటెంటనే పదహారుసైనికులు వేగవచ్చినారు
లాఠీలతో మన వీరజినోవు కొట్టనాగినారు
రక్తనదులలో స్మృతిలుదప్పి నిశ్వాసబిగియుదాక
చావమోది వారంతవెళ్లిరి జైలుతల్పువేసి
వ. రాత్రిగడిచిపోయింది. పుదయాంచే దాని కాపలావాడు
మారి కొత్తసెంట్రి వచ్చాడు.
కొత్తసెంట్రి ఆ ఉదయంబున కారాగృహముకు
వచ్చినంతనే చూచినాడురా వీరజినోవు స్థితిని
నెత్తురుమడుగులలోన దేహము తుత్తునియలుగాగ
చావుదెబ్బలతో గోసివున్న ఆ జీవిని చూడగనే
గుండెకరిగినది దయాపరుండు కొత్తసెంట్రివాడు
జైలులోనికి వెనువెంటని చనిచూచినాడు దీక్ష
పావమెవ్వరో రైతుకుమారుడు పడిపోయాడంచు
ఉపచారంబులు చేసినాడురా కొత్తసెంట్రివాడు
ఎవరయ్యా మీ దేవూరంచు అడిగినాడు సెంట్రీ
సేదతీరి తన సోది చెప్పగా సాగినాడు ఖైదీ
రెండు ముక్కలన్నాడో లేదో రెప్పపాటులోన

గుర్తువచ్చి తన తమ్ముడంచును కౌగలించుకొనియె.

వ. అలనాడు ఖామందుగారిభయంతో పారిపోయిన చియాంగే ఆ సెంట్రీ.

అన్నదమ్ములా నియమనము సై కన్నుల నీరు గార్చుచు
యెన్నినాళ్ళ కెన్నినాళ్ళకు సై కన్నుల గనబడితించును
ఏక శరీరంబులవలె సై కౌగలించికొన్నారురా
యిల్లు విడచి వెళ్ళిపోయిన సై వెంటనే చియాంగురా
హోటలందు సర్వరై సై కొన్నిరోజులు గడపెరా
కూడుగడవక దానితో సై కాలక్రమమున వాహరా
రిక్షా లాగుచు జీవిక సై నెట్టికేసె కొన్నాళ్ళురా
పిదప జపాన్ యుద్ధమంకున సై బ్రతుకలేక కూలీవాడుగా
మిలిట్రీలో చేరెరా సై కదనమునకు తా వచ్చెరా.

వ. అన్నదమ్ము లిద్దరూ ఒకరి కొకరు అర్థమైన తరువాత అక్కడ నుంచి తప్పించుకోడానికి ఆలోచించారు.

అన్నదమ్ములు యిద్దరుచేరి అంతట వూహించి
పారిపోవగా యెత్తువేసిరి పథక మల్లినారు
రాత్రి తప్పక పోరాదంను స్థిరము చేసివారు
రాత్రి డ్యూటికి మార్చుకొనుటకై సెంట్రీ తలచాడు
వెనువెంటనె తన పిమ్మట రాత్రివాని యింటి కెళ్ళి
జనరల్‌తోడ చెప్పి డ్యూటీని మార్చివేసుకొనియె
ఆరాతిరి తా మరల కాపలాదారువోలె వచ్చి
అర్ధరాత్రి ఆ అన్నదమ్ములు ఎగిరిపోయినారు.

వ. జినోవు అన్నతో పాటు తప్పించుకొని తన సైన్యాన్ని కలు

సుకొన్నాడు. వారంతా అధికోత్సాహంతో మొత్తంగా
మరి తొమ్మిదిరాష్ట్రాలను విముక్తిగావించారు.

వీరజికోవు తిరిగివచ్చిన వుత్సాహముతోడ
పట్టుపగ్గములు లేవు గెరిల్లావీరసైనికులకు
వీరనాయకుని అండజేరి వారంత రెచ్చిపోయి
తిరిగిశతృసైన్యాలపైనను దెబ్బతీసినారు
వరువరుసగా ప్రజాసైనికులు విజయమొందుచూను
క్యుమింటాంగ్ సేనలను తరుముచు కోహటించినారు
పందొమ్మిది ప్రాంతాలువారలు వీరసాహసమున
ప్రభులనుండి విముక్తిచేయుచు ప్రజ్వలించినారు.

వ. అంతలో చెంగైషేక్ సంధి చేసుకొనక తప్పింది కాదు.

ఎర్రసైన్యవిప్లవంబును సై ఎదిరించగ శక్తి చాలక
చంగైషేక్ జనరల్ అంతట సై సంధికెబడిపోయిరా
సంధిపత్రములు వ్రాసిరా సై శాంతికి ఒడబడినాడురా
మాసిటాంగ్ నాయకత్వము సై గుర్తించెను పాసిస్టురా
యింతటపోరు లేకనె సై యిరువాగులసఖ్యముండట
కోరుకొనిరి వారిద్దరు సై కోరి జాతి రక్షించిరి
కమ్యూనిష్టుసేనలంతట సై కదనమందు విరమించియు
విముక్తప్రాంతభూమిని సై పునరుజ్జీవింపచేసిరి.

వ. సంధిపత్రాలమీద సంతకాలు జరిగాయికాని అనుకొన్నం
తగా సఖ్యతమాత్రం సాధింపబడలేదు.

సంధిజరిగినతక్షణంబె ఆసంధిసూత్రములను
వ్యతిరేకించుచు చంగైషేక్ ఆహవ మొనరించె
వెనుకపాటుగా దొంగదోపిడీ చేయసాగినాడు

మధ్యచైనలో హనానులోనికి సేనల పంపారు
కాని చెక్కు చెదరని వీరకమ్యూనిస్టుసేన
యెదురులేని విప్లవపతాకలు యెగురవేసిగాది.
వచ్చిన జాతిద్రోహిసైన్యముల వచ్చినట్లుగానే
వెనుకతరిమినది ధైర్యస్థైర్యములు వుప్పిరిగొనగాను.
వ. ఇంతలో రెండవప్రపంచసమరం ఆరంభమయింది.
రెండవసారిజగత్సమరము రెక్కలిప్పగాది
పచ్చిఫాసిస్టులు జపానుజర్మని ప్రపంచమంతాను
పాలించగను ప్రజాశత్రులతో డికొన్నారండి
యుద్ధకాలమున ఎర్రసేనతో ఇనుమిక్కలిగాను
సఖ్యతచేయవలసివచ్చెరా చంగైషేకపుడు
సఖ్యత నెపుడు చేతులుకలిపే చంగైషేకయితే
దొంగమాటుగా అప్పుడప్పుడు ద్రోహచింతతోడ
దాడులు చేసి ప్రజాచైనను ముట్టడింపనూచే
కాని వారి ఆశయాసలన్నియు కూలిపోయి యి
యుద్ధకాలము ప్రజాచైన యున్నత్తు గెల్చెగాది.
వ. యుద్ధానంతరం సామ్రాజ్యవాద దేశాలన్ని విపరీత అర్థిక
సంక్షోభానికి గురియైనాయి కాని సోవియచైనా

చైనా సోవియట్‌లోపలను అశాంతిలేదండి
దరిద్రపీడిత ఆక్రందలనే దారి గనరావు
సహకారోద్యమ సహాయమున ఉత్పత్తి పెంచినారు
సస్యశ్యామలం బొనర్చి చైనా చక్కచేసివారు
ప్రజాచైనలో కష్టజీవికే పాలముహక్కు గలదు.
స్త్రీలు పురుషులు సమానభాగం సుఖపడుతున్నారు.

సిరిసంపదల తులతూగెడి ఆ చైనాప్రజలందు
వీరజినోవు సంగుకన్యకలు వినుతి కెక్కినారు
వారికుటుంబం బాదర్శంబై వన్నెకెక్కినాది
తమ్ములందరు పెద్దవారలై కర్షకులైనారు
అన్నగారు గెరిల్లదళములో చేరిపోయినారు
సమధికోత్సాహత నిత్యభోగమై చంద్రమండలంబు
వెలుగుచుండిన దేశభక్తుని వీరకుటుంబంబు

వ. ఈ ఆర్థిక సౌష్టవానికి జాతీయ చైనాగల పూంజీవాదు లంతా భ్రమసిపోయారు.

రెండవసారి జగత్సమరము పూర్తిచెందగానే
ధనికవాదులు పూర్వపుపగ యుద్ధోన్మతతో
ఎర్రచైనపై కుట్రలు ఎత్తులు వేయసాగినారు
సంధిమరతులను ఉల్లంఘించుచు శాంతిద్రోహులంతా
సోవియట్ చైనాకు సరఫరాచేయుట తగ్గించి
విప్లవప్రతిఘాతంబు వారలు వేయసాగినారు
వారిజులుం సరికట్టుటకొరకై పౌరుషవంతుడురా
వీరమాసిటాంగ్ తన సైన్యాలకు హెచ్చరించినాడు

వ. చైనావిప్లవ చరిత్రలో నాల్గవదశ ప్రారంభమయింది. విముక్తిసేన తను ఎర్రపతాకానెత్తి చైనానంతా యీ దోపిడిదారులనుండి విముక్తిచేయడానికి ప్రతినబూనింది.

గేయం

కదలండి ! రైతుజనులారా !

మీకెదరు

యెదురు నిలబడగలరీ వేళా !

ఆకాశవీధులలో
అరుణ ధ్వజంబెగసి
మనదీక్ష మనశక్తి
సమసమాజము చాట 1

ప్రకృతి మాతృ సస్య
పానీయములు దాచి
పేదలకు రానీని
పూంజివాదుల నణచ 2

జనుల సిరి సంపదలు
చేతులలో బంధించి
వల్లకాడును చేసి
పాలించు వారలట 3

మనమాన మర్యాద
మంట గలిపేసిరి
సిరులు పొర్లిన చీన
కరువులు కల్పించిరి 4

చైనదేశమ్మందు
సాగ దీపాలనము
ద్రోహాధిపుల శక్తి
తరలించివేదాము 5

అన్నదమ్ములు జనులు
అందరము ఒక్కటై
భూమిలో స్వర్గాన్ని
పూలబాటేద్దాము

ప్రతినబూనండి మీ
యత్నాని కెవరడ్డు
విద్రోహ పాలనను
ప్రేళ్ళతో పెరకండి 7
మాసిటుంగు ఉద్వేగవచనములు మారణశస్త్రములు
ప్రజాసేనలో నూతోత్సాహం బయలుదేరినాది
పూర్తిచెసవిముక్తి వరకును నిద్రబోమటంచు
రైతుదళములు విముక్తిసేనలు ప్రతినబూనిరాయి
విజృంభించిన ప్రజలశక్తికి వెనకడుగే లేదు
ముక్డెనుప్రాంతం ముట్టడివేసి మొగ్గినారు వారు
వీరజనోవు గెరిల్లాలలో విద్యుల్లతవోలె
మెరిసిపోవుచు సాగించెను విస్తారబలముతోడ.

వ. ఆముట్టడిలో సంగుకన్యక తిరిగి తన మామూలు ప్రకా
రం తీవ్రగాత్రులకు నర్సింగ్ చేస్తూంది

ద్రోహప్రభుత్వపు విమానదళము యేగుదెంచినాది
రెక్కలువిప్పిన శత్రువిమానం రెండుసార్లుతిరిగి
గురిచూచింది నర్సింగ్‌హోమును గుర్తుపెట్టుకొని
యుద్ధములోన పడిపోయిన ఒక వీర సైనికునకు
కట్లుకట్టుచున్నదిరాతెల్లి సంగుకన్య అప్పుడు
వినిపించినదిగాని సైరను విన్నప్పటికామె
రోగినివిడిచికదలరాదని పూరకొన్నదండీ
ధడిబిడిబాంబులవర్షము గురిసిరి ద్రోహులంతపైన
రక్షణశిబిరాలన్ని కాలినవి రగులుకొనియెనిప్పు
ఆమంటలలో సంగుకన్యక ఆహుతిఅయినదిరా.

రోగితోపాటు వీరమాతరా ప్రాణాలను విడచే
ద్రోహులవిధి పగతీర్చుకొని పారిపోయినారు
నర్సింగ్‌హోమంతయు నిప్పులలో నాశనమైనదండి

వ. ఆమెచావు రణరంగంలోవున్న జినోవుకూ, తదితర సైనిక
   ప్రాంతాలన్నింటికీ వెంటనే తెలియజేయబడింది.

జోహారులు వీరమాతకూ
జోహారులు సంగుకన్యకా ...

కదనమందున నిల్చియె
వదలినావ ప్రాణపుంజముల్
సమసమాజ సృష్టిలో
జ్ఞానజ్యోతివైతి వమ్మరో 1
నీపథాన గమియింతుము
నీఆదర్శము గాంతుము
నీవుచూపు త్యాగపథములో
ప్రాణాలైన నర్పింతము 2

అనుచు కదనరంగమందున
పతాకాలు దించి సైనికులు
వందనాలుజేసి తల్లికి
ముందుకురికిరి వారలు 3

వీరజినో వంతవచ్చియు
పూలతోడి శవపూజలు
చేసి తోటిసైనికాళితో
ప్రతినబూని వెడలిపోయెరా 4

వీరమూర్తి యెదలోపల
యెంత దుఃఖమే పొంగిన
మరచిపోయి విధ్యుక్తము
తరలింపగ చనినాడురా 5

వ. ఈ విముక్తిసేన జైత్రయాత్రతో మూడువంతులకుపైగా చైనా ఆక్రమితమైంది.

ప్రతిన బూనిన వీరవర్యులు, ప్రజాసేనలు, యేక
ధాటిగా, బయలుదేరినాయి — తందానా
ముక్డెన్ నగరం వశముచేసుకొనియె ,,
వరుస వరుసగా ప్రజాసేనలు వీరమూర్తులై పర్వు
లెత్తుచు, జాతిద్రోహుల పీచమణచుచు, ప్రధా
నగరాలన్నింటిని తా పట్టివేసినాయి తందానా
ప్రజాద్రోహులకు బుద్ధిచెప్పినాయి ,,
ప్రజాసేనలకు యెదురు నిల్వక పారిపోవుచు
క్యుమింటాంగ్ విద్రోహ సైన్యము క్రమము
క్రమముగా తగ్గిపోయినాది తందానా
తలలు వాల్చినాది ,,
ప్రభుత్వానికి సారధియైన పాపరాజ్య
మునపట్టదారు ధనికచైనకు, పెత్తం
దారు చంగైషేక్ యితే తందానా
నిలువడానికి నీడదొరకలేదు ,,
ప్రభుత్వంవిడచి పారిపోయినాడు ,,
పెకింగ్ విడచి పారిపోయినాడు ,,
ప్రజాసేనలు ప్రభుత్వాలను వశముచేసికొని

పట్నాలన్నీవశంచేసుకొని ప్రజాప్రభుత్వము
స్థాపనచేయుచు పరిగిడుతున్నాయి ,,
చివరకుసేనలు కాంటన్‌నగరం చేరవచ్చినాయి ,,
ఆఖరి ఆయువు పట్టుగాను బలమంతపెట్టిన జాతీయ ధనికుల
ప్రభుత్వమచ్చట ఓడిపోయినాది ,,
కాంటన్‌నగరము ప్రజాసేనపొందె ,,
మూడువంతుల చీనాజయమొందె ,,
ప్రజాసేనలకు యెదురులేదుబాబూ ,,

వ. చైనానంతాదాదాపు విముక్తంచేసి, ప్రజాస్వామికసోష లిజాన్ని అమలుజరిపి, విముక్తచైనాఅంటే ప్రాచ్యజాతి కంతా గర్వకారణంగా చేశారు.

వీరజినోవు సంగులవంటి రైతుజనముతోడ
ప్రజాసేనలు చైనానంతా ప్రభువిముక్తిచేసె
ధనికవాడుల, భూస్వాముల పెత్తనము మంటగల్పి
స్వర్గధామముగ చైనానంతా చేసినారువారు
ప్రాచ్యజాతికి గర్వకారణము విముక్తచైనారా
ఆసియా ప్రజానీకమంతకూ ఆదర్శపుతార
వీరనాయకుని మావ్‌సెటుంగ్ నవ విప్లవశక్తులకు
జేజేలిడుచు హారతులెత్తుచు జనులందరు నడిచి
ప్రజాచైనవలె స్వర్గసృష్టికై ప్రయత్నించరండు
జయముజయముచైనా ప్రజాసేనకు జయముదిగ్విజయము
జయము జయముస్వాతంత్ర్య చీనకు జయముదిగ్విజయము.



ప్రచురణ నెం. 20 వెల 0—6—0

# చదవండి!

| | | | |
|---|---|---|---|
| 1. | సోషలిజం — ఊహాజనితం — శాస్త్రీయం | ... | 1-4-0 |
| 2. | రష్యన్ సమస్య (నాటకం) | ... | 1-8-0 |
| 3. | లెనినిజం : పద్ధతి : సిద్ధాంతం | ... | 0-8-0 |
| 4. | శిలాశింహం (నాటకం) | ... | 1-4-0 |
| 5. | ఆస్తి — దాని పరిణామం | ... | 1-12-0 |
| 6. | రాజకీయ విధానం | ... | 1-8-0 |
| 7. | వలసదేశాలలో — | ... | 1-4-0 |
| 8. | పెట్టుబడిదారీ విధానం — పరిణామం | ... | 1-8-0 |
| 9. | ఆత్మబలి | ... | 1-4-0 |
| 10. | విలువ : ఖరీదు : లాభం | ... | 0-12-0 |
| 11. | మహాసభ తీర్మానాలు | ... | 1-0-0 |
| 12. | నేనూ — నాదేశం — (దర్శి చెంచయ్య) | ... | |
| 13. | రాజ్యాంగయంత్రం — విప్లవం | ... | 0-4-0 |
| 14. | పల్లెపట్టు — (చెహోవు కథలు) | ... | |
| 15. | కూలిపని : పెట్టుబడి | ... | 0-12-0 |
| 16. | గతితార్కిక — చారిత్రక భౌతికవాదం | ... | 0-4-0 |
| 17. | కారల్ మార్క్సు — ఫ్రెడరిక్ ఎంగిల్సు | ... | 0-12-0 |
| 18. | ఇటలీ కథలు | ... | 1-0-0 |
| 19 | స్త్రీ సమస్య — లెనిన్ | ... | 0-8-0 |
| 20. | చైనా విప్లవం — బుర్రకథ | ... | 0-6-0 |
| 21. | మహాత్ముని సంస్మరణ | ... | 1-8-0 |

ప్రతులకు :

## జనత బుక్ హౌస్

బిసెంటు రోడ్

గవర్నరుపేట :: విజయవాడ-2

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 108 B 150 |
| పుస్తకం పేరు | చైనా విజ్ఞానం |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | ci, 52,53 |
| లేని పేజీలు | i,ii |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |